# పశ్చిమ చాళుక్యరాజ్య చరిత్ర

( పద్యకావ్యము )





గ్రంథకర్త:

కొత్త భావయ్య చౌదరి,

దేవరహస్యాలు, కమ్మవారి చరిత్ర, రెడ్డి, కాకతీయ, వేంగిచాళుక్య, కాశ్మీరురాజ్య చరిత్ర మున్నగు గ్రంథ రచయిత.

సంగం జాగర్లమూడి,

గుంటూరు జిల్లా.



ప్రకాశకులు.

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి – తణుకు

1959వ

[ వెల రు.

# పశ్చిమ చాలుక్యరాజ్య చరిత్ర.

## పీఠిక.

ధారణకుపయుక్తమగు చారిత్రక పద్యకావ్యమాలలోనిదే యీ నా నాల్గవ కుసుమము. వేంగిచాలుక్య, కాకతీయ, రెడ్డిచరిత్ర లిదివరకే వికసించిన యామ్లాన సంయుదములు. చారిత్రక పద్యమాలలక్కరలేదనువారికిగాక, నివి సహజ సౌందర్య సత్త్వోపాసకులకు ముదముగూర్చును. నేటి చరిత్రలు తేదీలు, రాజులపేర్లు, యుద్ధ ఫలితములు మాత్రమే హెచ్చుగా తెలుపుచున్నవి. ఆకాలపు సంస్కృతులు, రాజుల కార్యములు, సామంతుల వివరములు తెలుపుటలో నిది కొంతవరకు ముందడుగు. సర్వసంపూర్ణచరిత్రగాక యిది సంక్షిప్తీకరించబడిన రచనము.

పశ్చిమ చాళుక్యులు బాదామి, కళ్యాణి నగరములలో బాలించి కర్ణాటక చక్రవర్తులనిపించుకొన్నారు. వారి రాజభాష కర్ణాటము గాని యొక్కొక్కపుడు దక్షిణదేశమంతయు వారికి లోబడి యుండెడిది. ఇందు పలువురు ప్రసిద్ధులున్నారు. రెండవపులకేసి, విక్రమాదిత్య I, రెండవ తైలపదేవుఁడు, ఆరవ విక్రమాదిత్యులట్టివారు. ఈ చాలుక్యుల కాలములో ఆంధ్ర, కర్ణాట దేశములందు వైదికవిద్యలు బాగుగా పోషింపఁబడెను. కాలాముఖ పాశుపత శైవమతము, శైవ దేవాలయములు వృద్ధియయ్యెను. విద్యార్థులకు, తపస్వులకు భోజనాలు, వస్త్రములు వైద్యసదుపాయములు, తైలములకొరకు గానుగలుసైతమీయ బడుచుండెను. రాజులు నిరంతరము యుద్ధములందున్నను వాని కెక్కడను లోపములేకుండెను. బౌద్ధ, జైనమతములను రాజులు హెచ్చుగా పోషింపకున్నను వానిని దేశములోని మహాజనులు, శెట్లు మున్నగువారు వృద్ధిజేయుచుండిరి. రాజులు తాటస్థ్యము వహించిరి. చెర్వులు త్రవ్వించి రాజులు మంచినీటి కొరతను దీర్చుచుండిరి. చలివేంద్రలుగూడ స్థాపించుచుండిరి. స్త్రీలలోకూడ విద్యలందారితేరినవారుండిరి. ఆరవ విక్రమాదిత్యుని రాణులలో నొకరికి "అభినవసరస్వతి" బిరుదముగలదు. సుప్రసిద్ధకవియగు బిల్హణుడు నీ కాలములో వర్ధిల్లిరి. నన్నెచోడకవిగూడ యీకాలమువాడే.

వేదములు, తర్క జ్యోతిషాది శాస్త్రములు నేర్చిన పండితుల కగ్రహార ములో, శైవ విద్యాసంస్థలలో పండితపదవియో, దేవాలయస్థానాధిపత్యమో దొరకు చుండెడిది. సల్లేఖనాది తీవ్ర నియమములను జైనమతస్థులు పాటించి నిర్వాణము జెందుచుండిరి. చోళ, చాలుక్యరాజ్యములు తీవ్రప్రతిస్పర్ధలకు లోనై దిగ్విజయ కీర్తికై పెనగులాడుచు సజీవులగు యుద్ధఖైదీలను కోటగోడలకు మేకులతోగొట్టి బిగిం చుట మున్నగు రాక్షసకృత్యములను సైతము గావించుచుండిరి. ఐనను దేశము సుభిక్షముగనే యున్నట్లు కన్పడును. ఒక్క కాలచుర్యబిజ్జలుని కాలముల్లోనే జైనులకు వీరశైవులకు యుద్ధములు ప్రజ్వరిల్లి జైనసంస్థలు నాశనము గావింప బడెను. తత్పూర్వ మట్టివి లేవు.

రాజు లనేకభార్యలను బెండ్లాడుచు వారినిగూడ పరిపాలనలో బాల్గొన నిచ్చుచు వారికిబుట్టిన వీరకుమారులను పలుచోట్ల మండలాధిపతులుగ నుంచి పాలించుచుండిరి. సామంతులు, సేనాధిపతులు అనేక బిరుదులనుబొందుచు రాజ్యరక్షణలో నిమగ్నులగుచుండిరి. జిజ్ఞాసువులకీ రచనము కొంతవరకైన యుపయోగించిన నాయత్నము వృధగాలేదనుకొందును. ఈరచనములో నాక **Epigraphical Reports, J. A. H. R. S.** సంపుటములు **The Colas,** ఆంధ్రులచరిత్రలు మొదలైనవి తోడ్పడినవి. ఆ గ్రంథకర్తలకు కృతజ్ఞుడను. ఈ గ్రంథమును తమ మండలిలో బ్రచురించుచున్న శ్రీనరేంద్రనాథ సాహిత్యమండలివారికిగూడ నా హృదయపూర్వక నమోవాకములు.

ఇట్లు,
గ్రంథకర్త.
26–5–'59



కృతికర్త:

శ్రీ కొత్త భావయ్య చౌదరి,

సంగంజాగర్లమూడి.

# విషయసూచిక.

# కృతిసమర్పణము - అష్టకము.

లక్షలకొలంది రూప్యముల్ వ్యయమొనర్చి
"పాలిటెక్నికు" నామ విద్యాలయంబు
శాశ్వతంబుగ నిల్పి యశంబుఁ గొన్న
పూజనీయుఁడు మన తిమ్మరాజమౌళి. 1

దేశమున పరిశ్రమలన్ని తేజరిల్ల, నిపుణుల కొంత దీర్పఁగాఁ గృపవహించి
యిట్టిసంస్థను నెలకొల్పె నెట్టిఘనుఁడొ చక్కెరంజేయుఫ్యాక్టరీ నొకటినిల్పె
వైద్యశాలను నెలకొల్పి వాసిగాంచె. 2

తాతయు దండ్రియున్ ధనముఁదాచి జమీలను బ్రోగుసేయ నీ
దాత యొసంగె సర్వమును ధర్మపరత్వత దేశవృద్ధికై
నీతినిహర్షభూపతిగ నిర్మలకారుణికార్ద్ర సద్గుణ
ఖ్యాత చరిత్రుఁ డీ కృతినిఁగాంచు సమాదరచిత్తవృత్తితో. 3

తనయునిపేర నిల్పెను ముదాన నరేంద్రుని గ్రంథమండలిన్
జనులకు వాఙ్మయాభిరుచిఁ జక్కఁగఁ జూపఁగ నెన్నొ గ్రంథముల్
వనరఁగఁజేసె ముద్రణముఁ దత్కవులెల్లరు సంతసింపఁగా
ననవరతంబు మండలికి యభ్యుదయంబునుగూర్చి నిష్టతోన్. 4

పూర్వచరితలపైన నపూర్వశ్రద్ధఁ, జాటి వెలయింపఁజేయు నీ మేటిసుగుణుఁ
డుడుగకయె దీనిఁ బ్రకటింప నందికొనియె, నిట్టి సచ్చరితునకిత్తు నిచ్చదీని.
తణుకుతాలూకబోర్డు కధ్యక్షుఁడగుచు, సేవసల్పుట ప్రజలకు చిరపరిచితి
ముళ్ళపూడ్యన్వయంబెల్లబుధులుపొగడ, పావనంబయ్యె నీకమ్మవంశ్యఘనత.
జ్యేష్ఠపుత్ర హరిశ్చంద్రశిష్టవరుఁడు, ఆంధ్రశాసనసభ మెంబరైన ఘనుఁడు
కాంగ్రెసునను బ్రజాసేవఖ్యాతినొంది, తండ్రికిం దోడునీడగు ధర్మనిరతి. 7

ఈ కృతిసమర్పణంబు మదీప్సితంబె, ధనమునకులోఁగికాదు సద్ధర్ముఁ డగుట
నితనిఁజేబట్టి కృతికన్యయొసఁగుచాత నాయురారోగ్యవిభవభాగ్యయశములను
సత్సంతానములనిచ్చి సర్వలోకరక్షకుండేలఁగాఁ గృపావీక్షణమున. 8

గ్రంథకర్త.



కృతిభర్త:

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు,

తణుకు.

# పశ్చిమ చాళుక్యరాజ్య చరిత్ర.

## 1. బాదామి.

చంద్రవంశజులందుఁ బ్రశస్తిఁగాంచి
ప్రథమము హిరణ్యరాష్ట్ర నివాసులైరి
శాతవాహన యిక్ష్వాకు సార్వభౌము
లకును సామంతులై చల్క్యరాజులుర్వి. 1

కార్తికేయ ప్రసాద రక్షణులనంగ
వినుత హారీతపుత్రు లౌ వీరులనఁగ
విష్ణుపాదారవింద రోచిష్ణువులన
రాణ నొప్పారెడి వరాహలాంఛనులన. 2

ధన్యమానవ్యసగ్గోత్ర ధారులనఁగ
నవబృథస్నానమున పవిత్రాత్ములనఁగ
మాతృ పితృసేవ మసలెడి మహిపులనఁగఁ
బేరుగాంచిరి చాలుక్య నృపతివరులు. 3

అంత వాకాటనృపుల సామంతులైరి
చలికికులజులు మిక్కలి శౌర్యసాహ
సములఁ బేరొంది కర్ణాట జనపదముల
నందు జయసింహ నరపతి యలరుచుండు. 4

ఆ జయసింహనృపాలు త
నూజుఁడు రణరాగుఁడనెడి యుర్వీశుం డా
భూజానిఁ గాంచె పులకే
శిజననాథోత్తముని విశేష గుణనిధిన్. 5

* * *

## పులకేశి I. 535 - 566.

మొదటి పులకేశి నామాంక భూవరేణ్యుఁ
డశ్వమేధపరాక్రముఁడనఁగ బేరుఁ
జెంది పాలించె బాదామియందు వీఁక
నిర్వదియు రెండు వత్సరాలుర్విఁ బ్రజల. 1

దేశవిభుఁడు మలప్రభాతీరమందు
కోటనొక్కటి బాదామి కొండపైన
శత్రుభేద్యంబు గాకుండ సాహసమున
నిర్మితముజేసి రాజధాని నట నిలిపె. 2

దానవులు వసియించిన ధాత్రియందుఁ
దొల్లి నివసించె వాతాపి బల్లిదుండు
కొండపై నది వాతాపి కొండయనఁగ
నవెయె "బాదామి దుర్గ"మం చందురిపుడు. 3

దుర్లభాదేవి యనియెడు తోయజాక్షి
గలదు బట్పూరవంశజాకాంతఁ దనకుఁ
బట్టమహిషిగఁ బెండ్లాడి ప్రభువరుండు
కీర్తివర్మను గాంచె సత్కీర్తి వెలయ. 4

యజ్ఞయాగంబులన్నియు నాచరించి
దానధర్మాదులెన్నియో తనివిదీర
సల్పి సత్యాశ్రయుండన జనములందుఁ
బేరుగాంచెను పులకేశి వీరవరుఁడు. 5

పులకేశి మరణమొందఁగ
నిలఁ బాదమి కీర్తివర్మ యేలికయయ్యెన్

చలికికుల సుధార్ణవుఁడన
నలరుచు "పురురణపరాక్రమ"మాది బిరుదులన్. 6

*
* *

## కీర్తివర్మ I. 566 – 598.

కొంకణమునఁ గదంబులఁ గ్రుంగఁజేసి
మౌర్య నల రాజులంగెల్చి మహితశక్తి
రాజ్యమును విస్తరించి యరాతు లదరఁ
గీర్తివర్మ యప్రతిహతకీర్తిఁ గనియె. 1

బాదామి నగరమున నె
న్నో దేవళములను గట్టి యుర్వీశుండున్
మోదమున సల్పె నట నా
నాదేవరలన్ బ్రతిష్ఠ నయమొప్పారన్. 2

తండ్రి యొసఁగిన రాజ్యంబు దశదిశలను
విస్తరింపంగఁజేసె నీ వీరవరుఁడు
తమ్ముఁడగు మంగళేశుఁడుఁ దనకుతోడు
పడగఁ గీర్తివిశాలుఁడై ప్రతిభఁజూపి. 3

పాండ్య, కేరళ, చోళియ, వైజయంతి
యంగ, వేంగి, కళింగముల్, గాంగ, యలుప,
మగధ, మూషక, వట్టూర, మద్రకాది
రాజ్యములఁ గెల్చి తన పరాక్రమముఁజూపి
యేలె నీ కీర్తివర్మయు నిద్ధరిత్రి. 4

ఇప్పుగిదిని భూమీశుఁడు
ముప్పదిరెండేండ్లు దర్పమునఁ బాలించెన్

గప్పములొసఁగఁగ రాజులు
మెప్పులఁ బొందుచును బ్రజలు మేటినృపుఁ డనన్. 5

* * *

## మంగళేశుఁడు 598 - 610.

ఇమ్మహితాత్ముఁ డేలుచును బృథ్విని బాసిన యంత ధీరుఁడై
తమ్ముఁడు మంగళేశపతి దర్పముమీరఁ జరించి బాదమిన్
ఇమ్ముగ రాజ్యవిస్తరణ హెచ్చుగఁజేసెను గాలచుర్యులన్
ముమ్మరమౌ రణంబులను బుద్ధనృపాదులగెల్చి యౌద్ధతన్. 1

మాళ్వ గుజరాతి ప్రాంతముల్ మహిపుఁ డటుల
జేర్చి సామ్రాజ్యమందున శ్రీలలరఁగ
నవనిపతి యంత విష్ణుగృహాలయంబు
నొకటి నిర్మించి విఖ్యాతి నొందినాఁడు. 2

పదియు రెండేండ్లు బాలించి వసుధపైన
మంగళేశ నృపాలుండు మహిత కీర్తి
గాంచె బాదామి రాజ్యమాకాలమందు
మేటిదై మించెనని ప్రజల్ మెచ్చుకొనఁగ. 3

పరమ భాగవతుండనఁ బరగుచుండి
యు "రణవిక్రాంత" బిరుదము నొప్పుఁదాల్చి
మంగళేశ నృపాలుండు మహితయశముఁ
గొనియె నాదేశమందున జనపదముల. 4

కీర్తివర్మ పుత్త్రుఁడు పులకేశి నృపతి
రాజ్యమునుఁ గోరనీయక రణముసల్ప

సందు మరణించె మంగళేశాధిపుండు
సంత రెండవపులకేశి యధిపుఁడయ్యె. 5

* * *

## సత్యాశ్రయ పులకేశి II. 610 – 642.

లాట, మరాట, మాళ్వ నృపరాజసమెల్ల నడంచి గాంగ, వా
కాటక, కోసలాధిపుల గర్వముడుల్చి, యలూప, ఘూర్జరుల్
మేటికళింగ, మౌర్యులును బృధ్విగదంబులు లోబడంగ గ
ర్ణాటమునేలె దర్పమున నా పులకేశియు జక్రివర్తియై. 1

ముప్పదియు రెండు వత్సరాల్ మోదమొప్ప
భూపరేణ్యుండు కర్ణాట భూమినేలె
పల్లవాధీశ నరసింహవర్మ యొకఁడు
కాంచిపురి నేలుచుండు నాకాలమందు. 2

పిష్టపురినాధ, కొల్లేరు నృపులతోడ
ఘోరముగఁ బోరి వేంగిని గొని యితండు
పుల్లలూరు రణంబున పల్లవనృపు
నోర్చి కాంచీపురి జయించె నూర్జితముగ. 3

నర్మదాతీరమున మహీనాథుఁడంత
హర్షవర్థను నోడించి యాజియందు
గజములం గొన్ని హరియించి ఖ్యాతిఁగాంచి
రాజ్యమును విస్తరించె నరాతు లదర. 4

దేశపాలనమంతయు దీర్చిదిద్ది
మూడురాష్ట్రములుగజేసి భూపుఁ డేలె

వేడ్క తొంబదితొమ్మిదివేల గ్రామ
జనులు హాయిగ నివసింప జనపదముల. ౫

కమ్మరాష్ట్రము, వేంగిరాష్ట్రమ్ము, దేవ
రాష్ట్రముల మూడుగెల్చి పరాక్రమమున
దనకు విశ్వాసపాత్రుఁడౌ తమ్ము విష్ణు
వర్ధనునకిచ్చెఁ బాలింపఁ బార్థివుండు. ౬

పారసీకసుల్తాన్ ఖుస్రు పర్వెజ నెడి
ప్రభువు తన రాయబారులన్ బంపుచుండె
నీమహీపతి మ్రోలకు నిట్లు చెలిమి
దేశదేశాల విభులతో దేజరిల్లె. 7

బౌద్ధయాత్రికుఁ డొకఁడు సంబుద్ధగుణుఁడు
హుయనుసాం గను నతఁ డిట హాయలుజూచి
మెచ్చి బాదామినగరంబు మేటియంచు
బొగడె పులకేశి పాలన నెగడుచుండ. 8

గాంగవంశీకుఁడై పేరుగనిన నృపతి
దుర్వినీతభూపాలుని దుహిత బెండ్లి
యాడి పుత్రులఁగాంచె నీ యమలగుణుఁడు
విక్రమాదిత్యుఁ డాదిగా వీరవరుల. ౯

రాజపరమేశ్వరుఁ డన విరాజితుఁడయి
పృథ్వివల్లభ పులకేశి పేరుదాల్చె
వేదశర్మ యనంబడు విప్రవరుని
కిచ్చె నిర్చులిగ్రామాన నెంతొభూమి
నిట్లె భూదానము లనేకమిచ్చె నృపతి. 10

పంచశతములుదాటి ముప్పదియునాల్గు
శకమునం దన పాలన జరుగుచుండ
మాకరప్పను గ్రామ మా మనుజవిభుఁడు
దానమిచ్చెను బ్రాహ్మణోత్తముఁ డొకనికి. 11

సార్వభౌమునిపాలనన్ జైనమతము
గూఢ వ్యాపించె దేశాన వాడలందు
రాతిగుడి జినేంద్రునకు నిర్మాణమయ్యె
నచట రవికీర్తి నానతి నయిహొలుపురి. 12

నర్మదానదివాక నరనాథు భువి విస్తరిల్లి యుత్తరదిశ యెల్లగాగ
తుంగభద్రానదీ రంగస్థలంబయ్యె ననికి దక్షిణమున హద్దుగాగ
సామంతనృపులెల్ల చక్రవర్తికి కనుసన్నల మెలఁగుచు నున్నతిగన
పాండ్య, కేరళ, చోళ ప్రభువర్యులనుగెల్చి కప్పముల్ గ్రహియించి
ఖ్యాతినొంద

పారసీకాది నృప రాయబారవరులు
నతనిఁ బొగడఁగ పరదేశయాత్రికులును
మతములన్నిఁట సమబుద్ధి మనసున నిడి
సార్వభౌముఁడు పులకేశి యుర్వినేలె, 13

పల్లవ నృసింహవర్మయు
గొల్లగ చతురంగబలముఁ గూరిచి వీకన్
వల్లభుపై దండెత్తఁగ
బెల్లుగ రణమయ్యె నందు నృపవరుఁ డీల్గెన్. 14

వాతాపి నగరరాజము
నాతరి దహనంబొనర్చి యంతట బోరన్
భీతిం గొలిపెను బ్రజలకు
భూతలనాథు సుతులంత బోడిమివీడన్. 15

* * *

## ఆదిత్యవర్మ, చంద్రాదిత్యుఁడు–642-655.

శూరపులకేశి నల్వురు సుతులు ఘనులు
క్రమత నాదిత్యవర్మ చంద్రాఖ్యవరులు
విక్రమాదిత్య జయసింహ వీరవరులు
అంత నాదిత్యవర్మ యే యధిపుఁడగుచు
వ్రాసెఁ బ్రభమీర కర్నూలు శాసనంబు, 1

చంద్రాదిత్య నృపాలుఁడు
సాంద్ర యశో విభవమూర్తి సామంతుఁడు మా
హేంద్రుని వలెఁ బాలించెను
ఇంద్రాణికిఁ దుల్యసాధ్వి యే వేళఁగనన్, 2

విజయ భట్టారికా నామ విదుషి పట్ట
మహిషిగాఁ బేరుగాంచి యీ క్ష్మాపతికినిఁ
దోడుపడి రాజ్యపాలనం దోయజాక్షి
శాసనంబులు వ్రాయించె చతురమతిని. 3

పల్లవ నృసింహవర్మ కప్పములు గొనఁగ
వీరు పదమూడు వర్షముల్ వీఁక నేల
పాలనము జేయఁదొడఁగఁగా నాలమందు
విక్రమాదిత్యుఁ డనుజుండు వీరుఁడగుచు
బల్లవ మహేంద్ర, పరమేశ ప్రభులఁగెల్చె. 4

వీరి పిమ్మట బాదామి పృథ్వియంత
విక్రమాదిత్యునికిఁ జెందె వీరుఁడగుట
నంత సింహాసనంబెక్కి సంతసమున
పాలనము చేయసాగె నా ప్రభువరుండు. 5

* * *

## విక్రమాదిత్య I. 655-681.

శత్రురాజుల నెదిరించి సంగరముల
పల్లవ నృసింహ వర్మాది ప్రభుల నడఁచి
రాజ్యసుస్థిరతను గాంచె రాజ బ్రథమ
విక్రమాదిత్య నరపతి వీరవరుఁడు. 1

తమ్ముఁడౌ జయసింహుఁడుఁ, దనయుఁడైన
వినయ భూపతి దోర్బడ విపులరణము
బ్రత్యహము సల్పి విక్రమాదిత్య నృపతి
చోళ, కేరళ, పాండ్యరాజులను గెల్చె. 2

ఆహవంబున నొరయూరునందు నిలచి
ధర్మశాసనమొకదాని ధాత్రిపుండు
వ్రాయగాఁజేసె నదియె గద్వాల శాస
నంబుగఁ బ్రసిద్ధమై యిపు డందె యశము
లేఖకుఁడు జయసేనుఁ డుర్విఁ బ్రకటించ. 3

అనివారిత 'రణరసికుం'
డను బిరుదము దాల్చి చలికి యవనీశుండున్
జనులెల్లఁ బొగడఁ బాలిం
చెను వర్షము లిర్వదారు శ్రీలొప్పారన్. 4

త్రిసముద్ర మధ్యదేశం
బసమాన పరాక్రమమున స్వాధీనపడన్
వెస నేలుచు సత్యాశ్రయ
వసుధాధిపుఁ డొందె కీర్తి వల్లభులందున్. 5

జయసింహనామధారా
శ్రయుఁడను సోదరుఁడుఁ దనకు సంగరకేళిన్
నయమొప్పారం దోడ్పడఁ
గ యొసంగెను లాటభూమి కరుణాన్వితుఁడై. 6

సార్థకంబయ్యె పేరని జనులుబొగడఁ
దండ్రితాతల రాజ్యవిస్తరణజేసె
రాజులెల్లరు కప్పముల్ రహి నొసంగ
* విక్రమాదిత్య నామాంక చక్రవర్తి. 7

చోళవిభుఁడు పోర్వ్యుఖరామ శూరవరుఁడుఁ
దనకు సామంతుఁడై కొల్వ ధాత్రినేలె
బాణరాష్ట్రంబునందున బ్రబలుఁడగుచు
నళిగ్రేనాడు బాలించు నధికశక్తి. 8

అన్ల్పవరగ్రామమును పూర్వమధికభక్తి
దానమిచ్చియు ముక్కంటి దరచినేత
దానిఁ బునరుద్ధరించె నీ ధాత్రిపుండు
వైదికమతాభివృద్ధికై వాంఛఁ జూపి. 9

*

* *

## వినయాదిత్య - 681 696.

విక్రమాదిత్య నరపతి పృథ్వి బాయ
గొమరుఁడౌ వినయాదిత్య కువలయేశు
డంది బాదామి రాజ్యంబు నధిక శౌర్య
వంతుఁడై పాలనమొనర్చెఁ బ్రజలుమెచ్చ. 1

---

* కొందరీతనిని రెండవ విక్రమాదిత్యుని సామంతుఁ డనుచున్నారు.

వినయాదిత్య నృపాలుఁడు
ననిలో మాళ్వనృపు నడఁచి యశముఁ గొనియెన్
జనపాలు రుత్తరాపథ
మున గల వారలను గెల్చి ముదితుండయ్యెన్. 2

ఇతఁడు పదిహేనువత్సరా లెలమి నేలి
బ్రాహ్మణులకిచ్చి భూము లపారముగను
శాసనమ్ములవ్రాసి యశంబుఁ గొనియె
వేదవిద్యల బోషించు విభుఁడటంచు. 3

ధర్మజునిబోలి వాత్సల్యతను జెలంగి
వాసుదేవునివలె లక్ష్మి వైభవమిడ
సరి నృపాంకుశుఁడయి జామదగ్నిబోలి
భరతుబోలి రాజాశ్రయభరణుఁడగుచు
మెలగెనంట పార్థివేంద్రు డీ మేదినిపయి. 4

వినయాదిత్యనృపాలుని
కనువుగ విజయాఖ్యనృపతి యరికేసరి యన్
దనయులు జనించి రిర్వురు
ఘనశౌర్యపరాక్రములయి కదనములందున్. 5

అరికేసరి వంశీకులు
వరశూరులు నగుచు మిగుల వర్థిల్లిరి భూ
వరు సామంతవిభులుగా
ధర వేములవాడలోన దర్పంబొప్పన్. 6

పారసీక నృపాలు కప్పములు గొనుచు
సింహళ నరేంద్రు నప్పనాల్ఁ జెలఁగుచుండ
మలయ కాలాభ్ర మొదలగు మహిపతులును
లోఁబడంగ నృపాలుండు రూఢినేలె. 7

గాంగ, యాళుప, సామంతకాంతు లెర్వు
రమితముగ సాయపడుచుండ నాజియందు
యుద్ధ మల్లాది బిరుదములొప్పఁ దాల్చి
కీర్తి వహియించె రాజులంగెల్చి వీఁక. 8

సేంద్రకపొన్నె రాజు దక్షిణమునందు
నుత్తరమున శిలాదిత్యుఁ డుర్వి విభుఁడు
తనకు ప్రతినిధులుగఁజేసి ధాత్రినేలె
సంధివిగ్రహులుండైయుండ జయసనాథ
వారు సన్నిహితులటంచు వాసిగాంచ. 9

శ్రీరామ పుణ్యావల్లభుఁ
డీరాజుకు సంధివిగ్రహిక లేఖకుఁడై
పేరొంది తామ్రశాసన
బ్భారకుఁడై వ్రాయుచుండె దృఢభవగు నాజ్ఞన్. 10

* * *

## విజయాదిత్య 696 - 733.

పార్థివుండగు వినయుఁడు పరముజెంద
తనయుఁడౌ విజయాదిత్య ధాత్రిపుండు
ధరణి బాలించె నంతట దర్పమొప్ప
యుత్తరాధిపు నొక్కని యుర్వి విభుఁడు
గెల్చి పాలిధ్వజాదుల దాల్చెనందు. 1

జైనవసతినున్న శంఖజినాలయ
పోషణకు నొసంగె భూవిభుండు
గ్రామదానమొకటి కద్దమనా నిర
వద్య పండితునకు భక్తితోడ. 2

ఏటెఁ ముప్పదియేడేండ్లు నేల నట్లు
దర్పమున విజయాదిత్య ధరణినేత
తండ్రితాతల్ గడించిన ధాత్రినెల్ల
చెక్కుచెదరఁగ నీఁడెట్టి చేవకాఁడొ. 3

పుడమి బాసినయంత నీ భూవరుండు
విన్నబోయెను బాదామి వీరలక్ష్మి
విక్రమాదిత్య చాలుక్య వీరవరుఁడు
నంత నభిషిక్తుఁడయ్యె నా యవనిపతిగ. 4

అరువందల ముప్పదియారు శకము
వర్షమున విజయాదిత్య ప్రభువరుండు
నమరఁజేసె నలంపురి యాలయమున
నొక్క ప్రాకారబంధము నుత్సుకతను
భట్టపాదుఁడు నిర్మించు పనినొనర్ప. 5

పట్టడకల్లున సంగమేశ్వరుని గుడిని
యీనృపాలుఁడె నిర్మించె నెసఁగఁ గీర్తి
జైన శైవ మతంబుల సమతఁగాంచి
పేరుఁగొనె విజయాదిత్య పృథ్వినేత. 6

* * *

## విక్రమాదిత్య II. 733 - 747.

అరువందల యేబదియైదు శకము
విక్రమాదిత్య నరపతి విభవమొప్పఁ
బడసెఁ బాదామి రాజ్యంబు పల్లవులునుఁ
దెలుఁగు చోళులు భయమొందఁ దేజరిల్లె. 1

నంది పోతాఖ్య పల్లవ నరపతిపయి
విక్రమాదిత్య చాలుక్య విభుఁడు రణము
సలిపె జయమొందె నేడవశతముదాటి
నలుబదొక్కటి వర్షాన చలముహెచ్చ.

తాతలు గడించినట్టి బాదామి రాజ్య
హద్దులకు భంగమయ్యె నీ యధిపుకాల
మందు క్షీణించుచున్న చిహ్నములుఁ గలిఁగె
నేది యెప్పుడు జరుఁగునో యెవ్వఁడెఱుఁగు?

వీఁక పదునాల్గు వత్సరాల్ సాకి ప్రజల
విక్రమాదిత్యుఁ డీ భువి వీడె నంత
పాలకుండయ్యె బాదామి వసుధనేలఁ
గీర్తివర్మనృపాలుండు కీర్తిశాలి.

తండ్రి నడచిన దారినే ధాత్రిపుండు
దేవళంబుల లంపురిఁ దేజరిల్లఁ
జేసినట్టులఁ గన్పించు శ్రీలలరఁగ
దక్షిణాపుకాశిగాఁ దానిఁ దనరఁజేసి.

* * *

## కీర్తివర్మ II. 747 – 753.

అలుప ఖేడారువేలులో నధిపతులను
దనదు సామంతులుగఁజేసి ధరణినేలి
కీర్తివర్మయు గొనియెను కీర్తి, నైన
ధాత్రిపుల జివరివాఁడు బాదామి యందు.

ఎనిమిదేండ్లు బాలించె నీ మనుజవిభుఁడు
తొల్లి విభవము క్షీణించ నెల్లయెడలఁ
బనదు సామంతనృపులలో దంతిదుర్గ
రాష్ట్రకూటుఁ డెదిర్చియు రణమొనర్చె. 2

ఏడువందల యేబదిమూడు క్రీస్తు
శకమునన్ రాష్ట్రకూట వంశజుఁడు దంతి
దుర్గుఁ డీ దేశము జయించి దోర్బలమున
మేటియై యేలె నంత గర్నాటభూమి. 3

అంత చాలుక్యపతులు సామంతులగుట
వారిచరితలు కాలగర్భాన దూరె
కాలమహిమంబుఁ దెలియఁగాఁ గలమె మనము
బండు లోడలు, నోడలు బండ్లుగావె? 4

*

* *

## రాష్ట్రకూట పాలనము. 753 - 973.

పశ్చిమ చలుక్యరాజుల ప్రభ దొరంగి
రాష్ట్రకూటపాలనము జెలంగుచుండ
తూర్పుచాలుక్యనృపతులు దోర్బలమున
నచటి సామంతులం గెల్చి రప్పుడపుడు. 1

ఇలను మహిశూరు గాంగరాజుల జయించి
రాణకెక్కెను పతి నరేంద్ర మృగరాజు
ప్రముఖులైదుంబ నోలంబ పల్లవులను
వీఁకఁ గెల్చెను విజయాఖ్య వేంగినేత
యైన భువి రాష్ట్రకూట రాజ్యమున నిలిచె. 2

భీమ చాళుక్య నరపతి వేంగియందు
బాలనము సేయఁగా దళవాయులైన
బిజ్జ, యయ్యప, ధలగ, గోవింద, లోక
భిక్కు రాజమయుర్ దాత బిక్కు లాజి
సలిపి యందోడి వెనుకకు జనిరి చింత. 3

రాష్ట్రకూటులు బాదామి రాజ్యమేల
విక్రమాదిత్య నామాంక విభులిరువురు
తైలపుం డయ్యనాఖ్యాది ధారుణీశు
లచట సామంతులైయుండినట్లు దోచు. 4

రెండువందల యిర్వది యేండులట్లు
చళికిశులు సామంతులై సంచరించి
తుదకు రెండవతైలపు దోర్బలమున
రాష్ట్రకూటులఁగెల్చి కళ్యాణిరాజ్య
లక్ష్మిఁ బొందిరి ప్రజలు హర్షమును బొంద. 5

ఆంధ్రదేశమునందెట్టి యాధిఁ గనిరొ
పదియవశతాబ్ది కవులలో పంప, పొన్న
నాగసేనులు వెడలి కర్నాటమునకు
జైనమతగ్రంథములకు కన్నడపుబాస
నవతరింపఁగజేసిరి యద్భుతముగ
రేచనయు బద్మకవి యాంధ్రరచనఁజేయు. 6

దంతిదుర్గుఁ డెల్లోరను దైవభక్తి
గుహలఁ దొలిపించె కైలాస గుహలనంగ
గవియు వేదాంతియై వన్నెఁ గాంచినా డ
మోఘవర్షుఁడు (I) ప్రతిభతోఁ బుడమి నేలె. 7

జైనగుణ భద్రసూరి రచనమొనర్చె
జినమహాపురాణంబు నీ నృపుని మ్రోల
రాష్ట్రకూటుల సచ్చరిత్రంబు లెన్నొ
గల్గినను దీన వివరింపఁ గాదుగాని. 8

*   *   *

## కళ్యాణిచాలుక్యరాజ్యము

## తైలపదేవరాజు II. 973 – 997.

రాష్ట్రకూటుల పరాక్రమముక్షీణింప నమోఘువర్షుఁ జయించి ముదముతోడ నూటయెన్మిదియుద్ధములను శత్రువులను బారంగఁద్రోలి యపారశక్తి జోర్పులమెప్పుఁగ దుర్గంబులెనుబది యెన్మిదింటి హరించి యెసఁగఁగీర్తి మాన్యఖేతపురంబు మహితస్థలంబంచు నిజరాజధానిగా నెలకొలిపియు

తైలపుఁడు సార్వభౌముఁడై ధరణినేలె
రట్టపాడి యేడున్నరలక్షఁ బ్రతిభఁ
గెల్చె చోళనరేంద్రు దిగ్విజయయాత్ర
తిరిగి పశ్చిమచాలుక్య ధరణిపతుల
బ్రభవెలింగె నచ్చటనుండి బహువిధముల. 1

పరమారవంశ సంభవుఁ
డరివీరుఁడు మాళ్వనేత యగు ముంజపతిన్
దురమున జయించి పిమ్మట
బరిమార్చెను తైలపుండు పగసాధింపన్. 2

ఇరువదినాల్గు వత్సరము లేలెను తైలపచక్రవర్తి యా
ధరణికి తుంగభద్రనది దక్షిణహద్దుగనుండ శూరుఁడై
యరి నృపవర్యులంగెలిచి యాహవమల్లుఁడనంగ మండలే
శ్వరుఁడన బేరుజెంది ఘన సాహసకార్యము లాచరించుచున్. 3

ముసలి మల్రూరుప్రాంతాన భూవిభుండు
నాగరాశ్యాఖ్య పండితునకు నొసంగె
దేవతార్చన సలుపంగ దిట్టపరచి
కొంతభూమిని తనభక్తి కుదురుకొనఁగ
విష్ణువర్ధన బిరుదంబు వీఁకఁ దాల్చి.

దానమొక్కటి మిక్కిలి ధర్మపరత
బాగలిగ్రామ కాళేశు భక్తిఁగొలిచి
రాష్ట్రకూటుఁడు కన్నడరాజొసంగ
దానిఁ బునరుద్ధరించె నీ ధాత్రిపుండు
వైరమెంచక ధర్మైక వాంఛజూపి.

ప్రభుని సామంతుఁ డాదిత్యవర్మ యేలు
కోగలిని పంచశతమును గోర్కెమీర
ఆర్యవర్మ యొకండేలె నంతముందు
నతఁడు వన మొండు నిర్మించె నాలయముస.

ఇతఁడొనర్చిన కార్యము లెన్నిగలవొ
యన్నియును గాలగర్భాన నడఁగిపోయె
కీర్తియొక్కటి మిగిలె నీ నృపవరునకు
తిరిగి రాజ్యంబుస్థాపించఁ ధీరుఁడగుచు.

జైనమతము విజృంభింప శ్రావణబెల
గొలను నిర్మాణమయ్యెను గోమతేశ్వ
రాఖ్యవిగ్రహ మరువది యడుగులెత్తు
గలది మహి శూర నీతని కాలమందు
నేటికిని దాని బూజింత్రు నిఖిలజనులు.

* * *

## సత్యాశ్రయుఁడు. 997 - 1008.

తైలపుఁడు దాటిపోవ సత్యాశ్రయుండు
పాలనకువచ్చి పాలించె పదునొకండు
వత్సరంబులు కళ్యాణి వసుధయందు
వైరియగు చోళరాజును బారఁద్రోలి. 1

రాజరాజచోళుఁడు వేంగిరాజ్యమందు
క్రమముగా ప్రబలుఁడౌటను గాంచి యతఁడు
బయలనంబిసేనానినిఁ బంపి యంత
ధరణికోటాది దుర్గముల్ ధ్వంసపఱచె. 2

వేంగి బాలించు నేత లీ విభునికపుడు
వైరువైరి చోళులకును బంధులగుటఁ
దనదు కర్నాటభూమికిఁ దండయాత్ర
రాఁగ వెనుకకు మరలించె వేంగినుండి. 3

రాజరాజను దక్షిణరాజ్యనేత
వీఁక నవలక్షబలమును జేర్చిరాగ
చోళసైన్యాలు వనవాసి జుట్టుముట్టి
కొల్లిపాకాది నగరముల్ కొల్లగొట్టె. 4

దోచి ధనమును స్త్రీలను దుష్టబుద్ధి
దోనపురిదాక గైకొన్న దోర్బలమున
పారద్రోలిరి వారలం బ్రతిభజూపి
విక్రమాదిత్యుఁ డాదిగా వీరులెల్ల. 5

తైలపుఁడు కూర్చిపెట్టిన నేలనెల్ల
నిల్పుకొని రాజ్యపాలన సల్పె నితఁడు

కష్టసమయమ్ములను లెక్కఁగనక పోరి
ధరణిఁ బాసెను విభుఁడు సత్యాశ్రయుండు.

* * *

## విక్రమాదిత్య V. 1008-1013.

నృపుఁడు సత్యాశ్రయుఁడు భువి వీడినంత
విక్రమాదిత్యుఁ డైదవ విభుఁడు వచ్చి
యేలె కళ్యాణిరాజ్యంబు లీల నతఁడు
చోళరాజులతో బోరుచుండె నపుడు.

అట్టి సంగ్రామరంగములందు వీర
లొకరినొకరు జయించలేకుండి రంత
వసుధ నోలంబవాడి ముప్పదియు రెండు
వేలను జయించి యీ నృపుఁ డేలఁదొడఁగె.

ఇతఁడు త్రిభువన మల్లాఖ్య పృథ్వీపతిగ
బాలనంజేసి పేరొందె వత్సరమ్ము
లైదు కళ్యాణరాజ్యాన మోదమొప్ప
నయ్యనాఖ్యుఁడు పిమ్మట నధిపుఁడయ్యె.

* * *

## అయ్యన II. 1013 - 1018.

అయ్యనాఖ్య పృథ్వీపతి యైదువర్ష
ములు మహీపాలనంజేసె ముదితుఁడగుచుఁ
దనకు వసుధైకవల్లభుం డనెడి జ్ఞాతి
సాయపడుచుండ పాలనా సమయములను.

ఈనృపాలుని కార్యము లెఱుకపడవు
గాని యీరాజ్యలక్ష్మి భూకాంతు నంద
సుస్థిరంబుగ నిలిచె వసుంధరపయి
నింతలో నయ్యనాఖ్యుఁ డనంతుఁ గలిసె. ★. 2

*

* *

## జగదేకమల్లజయసింహ II. 1018 - 1044.

అంత జయసింహవల్లభుం డధిపుఁడగుచు
నవని జగదేకమల్లుఁడన్ ఖ్యాతినొంది
నవశతంబులు దాటియు నల్బదిశక
మందు సింహాసనంబెక్కె హర్షమొప్ప. 1

ఇరువదియారు వర్షముల నింపుగఁ బాలనఁజేసి యీ నృపుం
డరి నృపవీరులంగెలిచి యాహవభూమిని కాన్కలంది సం
గరమున రాజరాజ జననాథుని వేంగినృపాలు నోర్చి యా
ధరణి నొసంగెఁబో విజయధాత్రిపుకున్ ఘన యాశ్రితార్థికిన్. 2

నాలుగేండ్లిటు వేఁగిలో నడచినంత
చోళసైన్యాలు వీఁకమై జుట్టుముట్టి
పారఁదోలఁగ విజయాఖ్యపతి సతండు
మరలివచ్చెను కళ్యాణపురమునకును. 3

కాటమయ్యా రసాఖ్యుండు ఘనవిభుండు
వీఁక వనవాసి పదిరెండు వేల నేలు
నితని సామంతుఁడగుచును నేతగిరిని
దాశరసనాము సేనాని దండనాథ
రెబ్బరసనాముఁడొకఁడును తేఁడుగొల్వ
నేలవీడున ప్రభుఁడుండి యేలుచుండు. 4

జైనమతుల నన్నిఁటి చదునుజేసి
గంపిలిం గొల్లిపాక దగ్ధంబొనర్చి
పోడిమినిఁ గెల్చె యితని దన్నాడ చెంత.

అశ్వములు, వస్త్రవాహనాలాజికరులు
నెంచఁతో యుద్ధవీరులు సుందరాంగు
లంత వశమైరి రాజాధిరాజునకును
నాశనముజేసి పూంతూరు నగరమెల్ల
మన్నిపైచిరి చోళులు దోర్బలమున.

మేటివిలుకాండ్రు సైనికుల్ ఘాటినడుప
యుద్ధగజరాజములు వాజులొంటెలుఁగల
కదనరంగస్థలుల్ భయంకరములయ్యె
నొప్పుచుండె నాకాలపు ముప్పుఁదెలుప.

కక్షవహించి నాయకులు గాఢమహోద్ధతి బోరుచుండఁగాఁ
దక్షత బట్టి వారల నుదగ్రత చోళనృపుండు తత్పురిన్
శిక్షనొసంగఁ బోల్చి సజీవులఁగొట్టెను కోటగోడలన్
రాక్షసకృత్యమిద్ది యని రాజులువారలు నెంచుచుండఁగన్.

చోళరాజాధిరాజవీరశూరవరుఁడు
గాని కొప్పము ప్రాంతాన కదనరంగ
మందతఁడు ప్రాణములఁబాయ సతనితమ్ముఁ
డైన రాజేంద్రుఁ డని సల్పి యధిపుఁగెల్చె.

రాయబారములంప నిరాదరించ
దండనాయకుల్ వెనుకకుఁ దరలిరాగ
నిట్టి రణరంగములమధ్య నిడుములంది
రాజ్యపాలనఁజేసె నీ రాజవరుఁడు.

ప్రభుని సామంతుఁడగు కీర్తివర్మదేవుఁ
డేలు వనవాసి పదిరెండువేల దానిఁ
గాచు తొంబదియార్వేల గంగవాడి
విక్రమాదిత్యసుతుఁడు పేర్విక్రమమున. 10

అధిపురాణి అక్కాదేవి యతిచతురత
రాజ్యపాలనందోడ్పడె రాణమెరయ
నట్లె రాణి లీలాదేవి యలరుచుండు
శ్లిష్టసమయాల నృపతి సంతుష్టిపడఁగ. 11

మహిపు సామంతుఁడై మహామండలేశ
బిరుదము ధరించి కొల్చెడు బిజ్జనాఖ్య
కాలచుర్యవంశీకుఁ డొకండు నట్లె
యితర సామంతులెందరో పతినిగొల్వఁ. 12

ధర్మవోలు, ద్రోణపురాది స్థలములందు
జైనవసతులన్నిఁటి మహాజనులు, శెట్లు
పోషణం జేయుచుందురు, వృషమిపతులు
శైవదేవళపోషణ జరుపుచుండ. 13

ఉత్తరేశ్వర దేవళంబున్ప్రబోటఁ
గలదు మఠమొండు ఎలమెలు గ్రామమందు
దానికి నొసంగె నొకగ్రామ దానమచట
తపసి విద్యార్థి పోషణ దనరుకొరకు. 14

భక్తి జయసింహ నోలంబ పల్లవుండు
తర్దవాడి సహస్రము ధాత్రినేలు
చక్రవర్తి సామంతుడై సాహసమున
శైవ దేవళ మఠము రక్షకుఁ డనంగ. 15

వాసుదేవాఖ్యుఁడన్ గాళిదాస సుతుఁడు
దండనాయకుఁడై ప్రభు నండనుండ
నాతఁడొక మహాసామంత యధిపుఁడనుచు
బేరుజెందెను కర్నాట పృధ్విలోన.

విక్రమపురాన నున్నట్టి విపులసంస్థ
శైవకాలాముఖమఠంబు దేవళంబు
నచటి విద్యార్థిపోషణ లందుకొరకు
గ్రామమొండిచ్చె బల్లవాఖ్య నరవరుఁడు.

రట్టకులమహాసామంత రాజొకండు
అంకయాఖ్యుఁ డంకేశ్వరు నచట నిలిపి
గ్రామదాన మొసంగె సుగంధవర్తి
యనెడు దానిని భక్తిమై యధిపునాన.

సిందవాడి సహస్రము సీమనేలు
తెలుఁగుచోడుఁడు బిద్దన తేజమొప్ప
రాణ మెరయఁగ బాల నారాయణాది
బిరుదములఁ దాల్చి సామంత పృధ్వినేత
గుంచరాచెట్టుఁడొక్కఁడు కాలచుర్య
వంశజుఁడు దానినే యేలెఁ బ్రభమమంచు.

గండపయ్య, సంగమయ్య, గంగాధరయ్య
విక్రమాదిత్య విజయాది వీరవరులు
దనకు సేనానులైయుండి దాడులందు
జయములంగాంచి వేంగి న్వశంబుగొనిరి.

వెలసెనొక జైనవసతి కోగలిపురాన
నిచట నాధ్వర్యము వహించు నిందకీర్తి

పండితుఁడు, సుప్రసిద్ధుఁడై ప్రజలసేవ
సలుప నందు వసించి యశంబుఁ గొనియె. 21

రెండువందల యేబదియేడుమంది
విప్రవిద్యార్థులున్నట్టి విపులసంస్థ
నాగవావి విద్యాలయోన్నతి కొసంగె
భూములం గొన్ని నచ్చట భూవరుండు. 22

చోళబిడ్డన నిరుగ నీ చోళనృపులు
చక్రవర్తి సామంతులై సంచరించి
వసుధనేలి యలంపురి ప్రాంతమందు
నచటి బ్రహ్మేశ్వరుని పూజలాచరింత్రు. 23

సంగరములెన్నొ కూడలి సంగమమున
జోళరాజులతోఁ గల్గ సోమనృపతి
తుదకు నందోడి రుగ్మతన్ దుంగభద్ర
నాత్మహత్యచే మరణించె నటఁ భయాన. 24

కన్నెమున్నూరునుం బెదకళ్ళెనూరు
నేలు నెలువాడి యేనూరు నేతగిరిని
నిలిచి బిజ్జనచోళుఁడు నేతయగుచు
నితడు పూండూరు యుద్ధానఁ బ్రతిభఁజూపె. 25

*

*   *

## భువనైకమల్లసోమేశ్వరుఁడు II. 1068 - 1076.

పదిశతము లర్వదెనిమిది వత్సరమున
నగ్రజుండగు సోమేశ్వరాఖ్య సుతుఁడు

నంత పట్టాభిషిక్తుఁడై సంతసమున
బాలసఁజేసె కళ్యాణిఁ బ్రతిభమెరయ
వత్సరము తొన్మిదిని వీఁక వసుధపైన. 1

చోళరాజుల ధిక్కారసూచకమున
వీఁక భువనైకమల్లుఁడన్ బిరుదుదాల్చె
సోదరుఁడు విక్రమాదిత్య శూరవరుఁడుఁ
దనకుఁ దోడ్పడుచుండఁగా ధాత్రినేలె. 2

మండలేశ్వర సత్యాశ్రయుండు కొలుచు
బళిని జీమూతవాహన వంశ్యుఁడతఁడు
ఎరియమఠదేవళమునకు నిచ్చెఁ గొంత
భూమి బిక్కేశ్వరున కట బూజసేయ. 3

మసల జయకేశియాఖ్య సామంతనృపుఁడు
రాష్ట్రకాలుండు పురిగిరి రాజ్యమేలు
మూడువందలు ప్రభునాజ్ఞ మూలసంఘు
జైనవసతిని పురకముగా సంతరించి
దానమిచ్చెను భూమిని ధర్మబుద్ధి. 4

తర్దవాడి సహస్రము ధాత్రినేలు
సోవి యరసనా సామంత భూవిభుండు
మాధవయ్య నాయకుఁ డను మహాప్రసేవ
కుండు నగరేశ్వరునకిచ్చె గొన్ని సుంక
ములను రూవెగ గ్రామాన మోదమొప్ప. 5

విక్రమపురాన నుప్పట్టి విపులసంస్థ
శైవమఠదేవళములకు చదువుకొనెడు
వేదవిద్యార్థి పోషణ వెలయఁజేయ

ప్రభుఁడు తంగెడగె వసించఁ బల్లవరస
గరుణ 'బాడుబ్బె పాల' నా గ్రామమొసఁగె. 6

వత్సకులదివాకరుఁడును వడ్డెరావు
నారగోమయ్య నా దండనాయకుండు
ప్రభు మహామాత్యపదవీ విరాజమానుఁ
డగుచు బేరొంది కార్యము లమలుపరచు. 7

మహిపు రాణులు రేవల మైలలాఖ్యు
లిర్వురొసఁగిరి భూదాన మిచ్చకొలఁది
శివపురమున బ్రహ్మేశ్వర దేవపూజ
సలుపుకొరకు సురేశ్వరాచార్యునకును. 8

కోగలి కదంబలిగె చిల్లకుండి రెండు
వేలుఁ బాలించు జయసింగ పల్లవుండు
బాగలి తటాకమునకు నీ ప్రభువతంసు
నాజ్ఞ ధనమిచ్చె బ్రీతితో నమలుపఱుప. 9

వేదవిద్యలఁబోషించి విపులముగను
దేవళములు తటాకముల్ వృద్ధిపఱచి
జైన శైవమతంబుల సమతఁజూచి
భూమి దానములిచ్చెను భూవరుండు. 10

* * *

## త్రిభువనమల్ల విక్రమాదిత్య VI. 1076-1228.

నృపతి తమ్ముఁడు విక్రమాదిత్యవిభుఁడు
వీరరాజేంద్రచోళు కుమారిఁ బెండ్లి

యాడి యాతని సాయాన నధిపుఁడగుచు
నేలె కర్ణాటభాగ విశాలపుడమి. 1

త్రిభువనమల్లాఖ్యుండయి
ప్రభతో బాలించె నితఁడు వైరినృపుల్ ద
న్నభయం బొసంగ వేడఁగఁ
బ్రభువయి కళ్యాణపురినిఁ బ్రజ మెచ్చుకొనన్. 2

ధర్మశాస్త్రపురాణద్రష్టలఁ బోషించి, కవిబిల్హణాదుల గౌరవించి
శైవాలయంబుల, శైవమతంబుల, దేశమెల్లెడలను దీక్షనిలిపి
జైన, బౌద్ధాది సంస్థల కపకారంబు సలుపక వానిని సమతఁజూచి
విద్యార్థి సత్రాలు వేడ్క చల్వేంద్రలు, చెర్వులుం బావులు జెలఁగఁజేసి
దేవళాల్ సంస్థలు స్థిరముగ నడుపఁగా నగ్రజన్ముల కగ్రహారములిడి

దోర్బలుండగు నా కులోత్తుంగచోళుఁ
బ్రతిఘటించియు రాజ్యభద్రతనుగూర్చి
విస్తరింపఁగ జేసెన విమలయశుఁడు
ధీరుఁ డారవ విక్రమాదిత్య నృపుఁడు. 3

ఘన కళ్యాణిని బాలిం
చిన భూవరులందు సుప్రసిద్ధుండగు నా
జనవరుఁడు విక్రమాది
త్య నరేంద్రుని పాలనంబు దద్దయు నొప్పెన్. 4

చింతలూరు భీమరసానంతపాల
దండనాయకులంబంపి దర్పమొప్ప
వేంగిరాజ్యమును జయించి వీఁకతోడఁ
బాలనముసల్పెనీ చక్రవర్తి ప్రతిభ. 5

అగ్రజుఁడు సోమభూపతి యలిగి చోళ
రాజుతోఁజేరి సాగించ రణములెన్నొ
వాని బంధించివైచె నీ ప్రభువరుండు
వీఁకఁ గళ్యాణిరాజ్యంబు సాకె నప్పుడు. 6

కార్యశూరుఁడు సామంత కాకతీయ
బేతభూపతి గోరినఁ బ్రీతిమీర
సబ్బిసాయిరమిచ్చెను సాకఁ బ్రజలఁ
గౌరవిదేశంబుతో పాటుఁ గూర్మివెలయ. 7

కొల్లిపాకయు, గోడూరు, కోనభూమి
కొండపల్లి యాగమనగల్లు దండిదుర్గ
రాజములనెల్ల హరియించి రాణమెరయఁ
దనదు పాలన నెలకొల్పె మనుజవిభుఁడు. 8

తెలుఁగుచోడుఁడు బల్లయ దీప్తినేలు
సిందవాడి సహస్రము చెలువు మెరయు
ఘుట్యనాంకుఁడౌ చోళుఁ డొరంచు గుత్తి
పాలకుండయి సామంతపదవినుండె. 9

చోడబల్లయ శ్రీసతి సూనుఁడనఁచు
టెంకణాదిత్యుఁడను బిరుదాంకుఁడైన
* నన్నెచోడుఁడు సామంత నరవరుఁడయి
టెంకణము, పాకనాడులు ఠీవినేలు. 10

---

* త్రిభువనమల్ల బేతరాజు, టెంకణాదిత్య సోమిశెట్టి, త్రైలోక్య మల్లశెట్టి మున్నగువారు వ్రాసిన దుర్మతిసంవత్సరమునాటి శాసనమునుబట్టి యీయనకాలము నిశ్చయింపబడినది. (తె. శా. 106 పుట చూడుడు) త్రైలోక్యమల్లశెట్టి మొదటి సోమేశ్వరుని కాలమువాఁడు. సోమిశెట్టి నన్నెచోడుని సామంతుఁడు.

పండితకవీంద్రుఁడన నొప్పె ప్రతిభనితఁడు
నవ్యత కుమారసంభవ కావ్యమొకటి
తెనుఁగుబాసను రచియించి తేజరిల్లె
సముఁడనగ నన్నపార్యాఖ్య సత్కవికిని. 11

ఎరువ తొండయ చోళాఖ్యుఁడేలుచుండు
సార్వభౌముని సామంతుఁ డుర్వితలము
నెరువ కోడూరుప్రాంతాల నేర్పుఁజూపె
యేలు కందూరు గోకర్ణ చోళుఁడొకఁడు. 12

అవని రేనాడు సేవనాత్సనవిభుండు
చోళవంశ్యుఁడు సామంతుఁడేలుచుండు
కన్నరాఖ్యచోళుఁడొకండు కమ్మనాటఁ
బాలనముసేయు సామంత వంశ్యుఁడగుచు. 13

త్రిపురాంతక దేవునికై
నృపతి నలుబదైమ పురములిచ్చియు శ్రద్ధన్
దపసులు విద్యార్థులకును
గృపతో వసతుల నొసఁగెఁ గీర్తివహింపన్. 14

ఆరవ విక్రమార్కుఁడిటు లాంధ్రము కన్నడ భూములందునన్
గౌరవమందఁగాఁ బ్రజ లఖండ పరాక్రమశాలియం చనన్
నేరుపుమీర నేలె భువినేతగఁ నేబదిదాటివర్షముల్
గోరికతో నృపుల్ దనకుఁ గోరిక కప్పము లందఁజేయఁగన్. 15

సత్కవీశ్వరు కృతిచేత సార్వభౌముఁ
డందుకొను శాశ్వతత్వంబటంచనంగ
విక్రమాంకదేవచరిత్ర విపులముగను
బిల్హణకవీంద్రరచితమై పృథ్విబర్వె. 16

తమ్ముఁడగు జయసింహుఁడు ధాత్రినేలఁ
గోరవనవాసిలోనుంచె గూర్మినంతఁ
దనకు వైరి కులోత్తుంగు దరికిఁ జేర
విక్రమాదిత్యుఁ డాతని వెడల నడిచె. 17

భావుకుఁ డధిరాజేంద్రుఁడు
భూవరుఁ డగుటకునుఁ జోళపురికేగి యటన్
దా వైరిబృంద మడచియు
బ్రావీణ్యంబొప్ప నతనిఁ బ్రభునిన్జేసెన్. 18

ఆరుమాసముల్ గడచిన యంతలోన
విప్లవము చోళపురిని నావిర్భవించి
హతమొనర్చిరి యధిరాజపతిని జనులు
విక్రమాదిత్యుఁ డదివిని విన్నబోవ. 19

దేవగిరిరాజు యాదవ భూవిభుండు
సాయపడుచుండు మిత్రుఁడై సంగరములఁ
బాండ్య, హోయిసల, కాదంబ పాలకులును
దనకు సామంతులై కొల్వ ధాత్రినేలె. 20

తురగ రేవంతులు, వైరికృతాంతులు, డాల్విద్యరాములు కొల్వుఁగొల్వ
సాహసోత్తుంగులు, సమరధనంజయుల్, సుభటమండలికులు జుట్టునుండ
శూరమహేశ్వరుల్, సుజనప్రసన్నులు, వాహాళధూమకేత్వరులు జెలఁగ
ప్రభు మంత్రోత్సాహ వరశక్తిసంపన్నులును పాళు గజకేసరులనుగలిఁగి
రిపుకుమారకమండలిక గండగత్తెరుల్, నుదిరంతగండలు నొప్పచుండ
స్వామికార్యార్థులు, స్వామివంచక శిరఃఖండనుల్ మరి నంకకారులుంత
అతులభుజాబలు లాశ్రిత జనతుష్టికారణుల్ రిపుభయంకరులు గల్ల
శరణాగతులకు రక్షణాసూర్పఁజాలిన 'వజ్రప్రాకారులు' వరలుచుండ

మండలిక బెంటుకారులు మహిపుఁగొల్వ
మూరురాయకఱెబిరుదాంకులుఁజెలంగ
రాజలీలాచమత్కార్తి తేజులుండ
పాదపద్మోపజీవులౌ పగిదినుండ
యుద్ధగజములు తురగములొంటెలున్న
యుర్వీపతి స్కంధావారమొప్పుచుండు. 21

రాణి లక్ష్మీమహాదేవి ప్రోణప్పురిని
ఏబ్బుచుండును పాలన, శక్తిజూపి
మల్లికార్జున యువరాజు మాన్యుఁడగుచు
తర్దవాడి సహస్రము ధాత్రినేలు. 22

భూవరేణ్యుఁడు భక్తిచేఁ బుధులు బొగడఁ
గ్రామదానమొసంగెను కరముబ్రీతి
నచటనున్న స్వయంభుదేవాలయమున
కద్ది "సంబెయవాడ" నాహ్వయము గలది. 23

చెర్వొకటి, భావి, చలివేంద్ర స్థిరముజేయ
నచటి విద్యాలయము పోషణాదులకును
దేవతాపూజకొరకును దిట్టపరచి
"మల్లగాన" గ్రామమునిచ్చె మహిపుఁడపుడు. 24

పుడమి పతిపాలనంబునఁ భూసురుండు
నచట సర్వాధికారి మహాప్రచండ
దండనాయక మహదేవ దనరుచుండు
దండయాత్రల గావింప దక్షుఁడగుచు. 25

కొండపల్లినుండి గోవింద సేనాన్య
సంతపాల దండనాయకుండు

వేంగిదేశమందు వీఁకఁ బాలించఁగాఁ
దిరిగి చోళులాజిఁ దీసికొనిరి. 26

మాలదాలూరు సత్ర విద్యాలయముల
కచటి ఋగ్వేదఖండిక కమితభక్తి
భూమినిం గొంత ధనమిచ్చె పోషణకయి
నాగరసనామమహాప్రధాన సచివుండు. 27

బౌద్ధదేవాలయంబు దంబళపురాన
గట్టె సంగవశెట్టి నా ఘనుఁ డొకండు
నందు తెల్లిగ లేబదిమందె జేయ
దీపదానంబు. సదియట దీప్తినొందె. 28

జైనవసతినిఁ గట్టించి చౌనపురిని
సోకశెట్టి భూములనిచ్చె సాకు కొరకు
వృక్షమూలగణము యాపనీయసంఘ
చారుకీర్తి పండిత మునిచంద్రశిష్యుఁ
డచట నాధ్వర్యము వహించి యమలుపఱచు
నన్యమతసహనంబట నలరుచుండ. 29

ద్రావిడ బ్రాహ్మణోత్తముల్ ప్రభునివేడ
సపద, క్రిష్టపల్లికలాది జనపదముల
నిచ్చె నగ్రహారంబుల నిచ్చభద్ర
మలయపండితుఁడట శాసనంబువ్రాయ. 30

వేడ్క వనవాసి పదిరెండు వేలతోడ
పానుగ ల్లైదు నూర్లును బ్రతిభనేలు
ధారుణీశ్వర సామంత తైలహుండు
పానుఁగలు నేలవీడునఁ దాను నిలచి

హొయిసలేశ్వర వినయుఁ డమేయగుణుఁడు
నగరనిర్మాణకుశలుఁడై నెగడుచుండు. 31

† రామేశ్వర గుడిమఠమునఁ
గౌమారవ్యాకరణము క్రమముగనేర్పన్
నేమించి నాగవరమయ
భూమిన్గొని యొసఁగె నచటి భూదేవులకున్. 32

దాక్షిణాత్యుల సోమనాథపురమనఁగ
నలరుచు స్వయంభుదేవళ మచటి రాజ
ధాని "పురిగర" నగరానఁ దనరుచుండు
వివిధభోగాలఁ జెలఁగుచు విస్తరిల్ల
నేడు లక్ష్మేశ్వరంబని వాడుచుంద్రు. 33

++ జైనవసతి యొకటి సల్లేఖనాదులఁ
బేరుఁగాంచి పురిని వెలసియుండె
ప్రతిభఁగన్న జైనభాస్కరనందియు
నందిపండితుండు నుందురచట. 34

రాష్ట్రకూటులు కాలచుర్య నరపతులు
జైన బౌద్ధ ధర్మంబుల సల్పుచుండ
శైవమత దేవళమ్ముల చళిక్కనృపులు
పోషణంజేసి మన్నింత్రు భూసురులను. 35

వసుధసోలంబవాడి ముప్పదియు రెండు
వేలునిగలంక మల్లాఖ్య విభుఁడు పాండ్య
వంశ్యుఁడుచ్చంగి నుండియు బాలనంబు
సేయు సామంతుఁడగుచు నమేయశక్తి. 36

---

† ఇది సేతురామేశ్వరము కాదు. బీజపూరు జిల్లాలోనిది.

++ సల్లేఖన మనగా, ఆత్మచింతచే నుపవసించుచు మరణించుట.

ధీరుఁడు కుమారతైలపదేవ నృపుని
ప్రతినిధిగ నేలె కోడూరుప్రాంత మతని
రాణి లక్ష్మిమహాదేవి రాణమెరయ
నతనిసుతుఁడు పెర్మాడియు నతిశయిల్ల. 37

మండల ద్వాదశమున మార్తాండుఁడనఁగఁ
బ్రథిత చాళుక్య గంగపెర్మాడియనఁగ
నలరుచు కుమారసోమేశ్వరాఖ్యుఁడుండి
కొల్లిపాకను బాలించి గూర్చిముదము
కుంతలాభ్యుదయమొనర్చి గొనియె యశము. 38

విజ్ఞానేశ్వరుఁ డను కవి
ప్రజ్ఞమెయిన్ ధర్మశాస్త్రగ్రంథము వ్రాసెన్
విజ్ఞానేశ్వరమనఁగను
దజ్ఞులు మెచ్చంగఁ దానిఁ ధాత్రిపునాజ్ఞన్. 39

నరవరుని మండలేశ్వరుఁ
డరికేసరి చలికివంశ్యుఁ డట బాలించున్
ధరణిని వేములవాడను
పురి తన కాపురముగాఁగఁ భుజబలమొప్పన్. 40

వేంగిదేశమును జయించి వెడలి కీర్తి
గాంచినాఁడు తైలపదేవపార్థివుండు
మాళ్వరాజ్యంబు లోఁగొని మహితయశము
నొందినాఁ డామహేశ్వరుఁ డుర్విలోన. 41

చక్రవర్తికి పెక్కండ్రు సతులు గలరు
రాణి లక్ష్మిమహాదేవి బ్రథమయయ్యె
అభినవ సరస్వతీనామ యరపదేవి
మన్నదేవి మహారాణి వన్నెకెక్కె

భవ్యచరితలు శ్రీశైల పశ్చిమమున
ద్వారనగరలంపురిదేవు భక్తి గొల్తు్ర. 42

సకలప్రవేశ భట్టా
రక నాముఁడు గురువరుండు ప్రభువర్యునకున్
సకలంబు తర్క విషయము
లకలంకముగాఁగఁ దెల్పు నవిరళబుద్ధిన్. 43

శైవమతములనెందఱో స్థానపతులు
వరలుచుండఁగ నాదిత్యభట్టొకండు
జ్యోతిషపరీక్షలో నెగ్గి ఖ్యాతినొందె
చక్రవర్తి బహూకృతుల్ సల్పుచుండ. 44

సిందెనాగ్రహారమునకుఁ జెందినట్టి
భూమిని పురాణపఠనకై భూసురులకు
నిచ్చెను కుమార జయకర్ణ నృపతివరుఁడు
మాన్యకీర్తి ప్రెగడ తనమంత్రికోర్కె. 45

మైలలాఖ్య పట్టపుదేవి మాన్యురాలు
నింక కేతలదేవియు నృపుని సతులు
గానవచ్చుచు నున్నారు ఖ్యాతిపరులు
దానములఁజేసి శాసనాల్ దనరవ్రాసి. 46

ఈవిధమున నల్లిలులు
శైవమతంబులును విద్యజదివెడి సంస్థల్
దేవళము లన్నసత్రాల్
భూవరుఁడేర్పరచి యేలె బుధులు నుతింపన్. 47

* * *

# భూలోకమల్ల సోమేశ్వర III. 1126-1138.

విక్రమాదిత్యుఁ డీ భువి వీడినంత
నతని పుత్త్రుఁడు సోమేశ్వరాఖ్య విభుఁడు
వీఁక భూలోకమల్ల నా బిరుదు దాల్చి
పాలనముసల్పె కల్యాణి ప్రభవెలుంగ
నచట పదిరెండువర్షముల్ హర్షమొప్ప. 1

చోళరాజప్రతినిధియౌ శూరవరుఁడు
గొంకరాజను వెలనాటి కువలయేశుఁ
డంత ప్రబలుఁడై వేంగిరాజ్యము హరింప
బ్రతిఘటనసేయనేరఁడీ పాలకుండు. 2

ఈ నృపాలునకును జనియించిరట కు
మారులిర్వురు జగదేకమల్లనృపుఁడు
తమ్ముఁడు కుమారతైలపధాత్రిపుండు
రాజ్యపాలనంబోడ్పడి రాజమెరయ. 3

వెంకనాఖ్యచోళుఁ డొకండు వీఁకనేలు
సార్వభౌముని సామంతుఁ డుర్వితలము
కన్నెనాడు, రేనాడును వన్నెకెక్క
హదరికల్లును నంద్యాల నధివసించి. 4

సిందవాడి సహస్రము సీమ, ములికి
నాడు త్రిశతము నేలెడి నరవరుండు
మల్లదేవాఖ్యుఁడితని సామంతుఁడగుచు
వినుత త్రైలోక్యమల్లుఁ డన్ బిరుదుదాల్చి. 5

బేతభూపతి పలనాటి పృథ్వినేలు
హైహయాన్వయుఁడనగ విఖ్యాతినొంది

సోమరస తిక్కపయ్యలు శూరవరులు
దండనాయకులై ప్రభు సండనుండ. 6

దక్షిణపుకాశియని ఖ్యాతిఁ దనరుచుండు
కదలె వాడదేవునకు భూకాంతుఁడపుడు
హించనేరి గ్రామము పన్నులెల్ల నొసఁగి
దానములు షోడశములిచ్చె ధర్మబుద్ధి. 7

సార్వభౌముని సామంత సకరదేవ
చోళభూపతి1 నరవాడి చుట్టునేలు
నచటి కుకునూరు రామేశ్వరాఖ్య దేవు
నకు నొసంగెను భూమి భూనాథునాజ్ఞ. 8

హొయిసలుఁడు బిట్టిదేవుఁడీ యుర్వివిభుని
మేటి సామంతుఁడై యేలె ధాటిఁజూపి
దక్షిణంబెల్లను జయించి దర్పమొప్ప
నితఁడు రామానుజ మతంబు నిచ్చఁగొనఁగ
జైనమతమడుగంటె నా జనపదముల. 9

*

* *

## జగదేకమల్ల II. 1138 - 1149.

సోమేశ్వరభూపాలుం
డీమహివీడి చనినంతనే కళ్యాణిన్
సోమ జగదేకమల్లుఁడు
భూమీశ్వరుఁడయ్యె ప్రజలు బొగడగ నతనిన్. 1

---

1 ఇది నలవాడియనిగూడ వాడుకజెందెను. పూర్వము నలవంశీకులుండెడిది.

ఇతని బంగరు నాణెము లిప్పటికిని
గానఁబడుచుండు దేశభాగ్యంబుఁ దెలుప
రాణి లకుమామహాదేవి రాణమెరయఁ
దనకుఁ దోడ్పడుచుండఁగాఁ ధాత్రినేలె. 2

గొయదవాడపురి న్నిరుం గోల చోళ
రాజు సామంతుఁడగుచును రాజ్యమేలు
వీరపాండ్యుఁడు బాలించు వీఁకతోడ
నచటి నోలంబవాడిలో నధిపునాస. 3

కుంతలంబను విషయాన గుదురుకొన్న
మాసివాడిప్రాంతంబును మహిపునాజ్ఞ
మండలేశ్వర కుప్పదేవుండు నేలు
చక్రవర్తి సామంతుఁడై సాకఁ బ్రజల. 4

విష్ణువర్ధన బిరుదాంక వీరవరుఁడు
బిట్టిదేవుఁ డాతని సుతుఁడట్టివాఁడె
హొయిసలేశ్వర నరసింహ యుర్వివిభుఁడు
నితని సామంతుఁడగుచును నేలుచుండు. 5

పదునొకేండ్లు కర్నాటపు వసుధనేలి
సోమ జగదేకమల్లుఁడు జొచ్చె దివికి
నంత నూర్మడి తైలపాఖ్య జనవిభుఁడు
నందె సింహాసనంబు కళ్యాణపురిని. 6

* * *

## తైలపదేవుఁడు III. 1149 - 1162.

ధరణిఁ బాలించుచుండఁగఁ దైలప్రుండు
ననుమకొండ సామంతుఁడైనట్టిరాజు
దుర్జయాన్వయ ప్రోలుఁడు దోర్బలమున
నితనినోర్చి స్వతంత్రుఁడై యేలసాగె
కొరవిదేశంబునందు నకుంఠితముగ. 1

తైలపనృపాలు బలహీనతను నెఱింగి
యంతవరకును వనవాసి యధిపుఁడైన
కాలచుర్యనృపాలుఁడు ఘనుఁడుబిజ్జ
నాఖ్య సామంతుఁడీ రాజ్య మాక్రమించె
వీఁకఁ గళ్యాణిపురమున వెలయఁ బ్రతిభ. 2

తైలపభూమీశుండిటు
బాలించెను కన్నడంబు బ్రభ క్షీణింపన్
దాలిమి పదమూడేండ్లిల
గాలము సన్నిహితమైన గతుఁడైపోయెన్. 3

*  *  *

## కాలచుర్యబిజ్జలుఁడు

బిజ్జలుఁడు దేశపాలన వీక సలుప
వీరశైవమతంబభివృద్ధియయ్యె
మిండ జంగాలఁ బోషించుచుండ మంత్రి
బసవన, నృపాలుఁడాతని వదలివైవ
వీరశైవులు చంపిరి బిజ్జలాఖ్యు. 1

శివుఁడొకఁడె దేవుఁడతనిఁ బూజింపవలయు
లింగరూపంబునుంచి కోరికల నొంద
శివునిభక్తులు సైతము శివసమాను
లన్యులెల్లరు హీనులటందు్రు వీరు. 2

వీరశైవమతం బభివృద్ధికొరకు
దేశికవిత వెలసె జాను తెనుఁగు నందు
పండితారాధ్య చరిత బస్వస పురాణ
ములు ప్రధానములగు నాంధ్రభూమిలోన
రగడలాదిగ వెలసె కర్నాటభాష. 3

శ్రీపతియు పండితారాధ్య చెన్నబసవ
బసవలింగాఖ్యు లీ మతవ్యాప్తిపరులు
పాల్కురికి సోమనాథుఁడీ వరుసవాడె
యన్యమతసహనములేని యార్యకోటి. 4

జైనసమయులతో వీరశైవులెల్లఁ
ఘోరముగఁబోరి, జరపి సంహారకాండ
నగరు కల్యాణి పాడగు నటులజేసి
రట్టి వీరవిహారము లడఁగినంత. 5

* * *

## జగదేకమల్ల III. 1163 – 1184.

ఇంతవరకేలుచుండి సామంతపదవి
తైలపుఁడు, బిజ్జనయుగూడ ధరణిఁబాయ
నంత జగదేకమల్ల నామాంక చలికి
రాణనొప్పెను గల్యాణిరాజ్యమందు. 1

తంత్రమునెఱింగి యపుడు స్వతంత్రుఁడగుచు
ధీరతఁ బ్రతాపచక్రవర్తి యనఁబరఁగి
పాలనముఁజేసె కర్నాటి నేల నంత
నిరువదొక్కేండ్లు తనదగు మురువుజూపి. 2

శూరకులమనదగ్గ శిలారవంశ
సోవిదేవాఖ్య సామంత భూవిభుండు
నితని సామంతుఁడగుచు నున్నతి జెలంగి
యేలుచుండును మహి నెలమేలునాడు. 3

మల్లపురిలో తటాకనిర్మాణమునకు
గొంత భూమినొసంగెను గోర్కెమీర
దండనాయక దుగిమయ్య ధాత్రినేలు
చుండు త్రైలోక్యమల్ల విభుండు వీఁక, 4

కోగలి, కదంబరిగె, చిల్లకుండి రెండు
వేలుబాలించు సామంత వీరపాండ్యుఁ
డచటి విష్ణ్వాలయమునకు నధిక భక్తి
భూమినొసఁగెను బాగలిన్ భూపునాజ్ఞ. 5

అంత జగదేక మల్లుఁడీయవనిఁ బాయ
వీఁకఁ గళ్యాణి రాజ్యంబు సాకుకొరకు
వీరసోమేశ్వర చలుక్యశూరవర్యుఁ
డపుడు సింహాసనం బెక్కె హర్షమునను.

* * *

## త్రిభువనమల్ల వీరసోమేశ్వర IV. 1184 – 1192.

అంత నాల్గవ సోమేశ్వరాఖ్యచలికి
విభుఁడు కళ్యాణిఁబాలించె విభవమొప్ప
వీర సోమేశ్వరుండను పేరుదాల్చి
వత్సరములెన్మిదికిమించి వసుధపైన. 1

నావిడిగె గ్రామపన్నులు భూవరుండు
భక్తినొసఁగె స్వయంభు దేవరకు నిచ్చ
ధర్మపురి తటాకమునకు దానమిచ్చె
గొన్నిభూముల, బన్నుల నన్నివదలి
తేజిమయ్య సేనాధిపతియు ముదంబు
జెంది, నృపుఁడట బాలనఁ జేయుచుండ. 2

గోవగేయ నామకోటలో వసియించి
రాజ్యమేలె నితఁడు రాణమెరయ
ప్రభుఁడు దాల్చెనపుడు త్రిభువనమల్లాఖ్య
బిరుద మొకటి తనకుఁ బ్రీతి గొలుప. 3

భోగదేవాఖ్య చోళుఁడు భూవిభుండు
పాలనము సేయు పెంజేరు ప్రాంతమందు
చక్రవర్తి సామంతుఁడై చాకచక్య
మలరఁగాఁ బ్రజలెల్ల వారభినుతింప. 4

సిందవంశీకుఁడును మహామండలేశుఁ
డైన యచి దేవరస ప్రభునాజ్ఞబొంది
కాల కాలేశ్వరునకును గ్రామమందు
భక్తి నొసఁగెను వరిపంటబండు పొలము. 5

వీర సోమేశ్వరునిఁగెల్చి వీఁకనంత
నాక్రమించి కళ్యాణి దోర్విక్రమమున
దేవగిరిరాజ్య జైతుగి భూవరుండు
పాలనము సేయఁదొడఁగెను ప్రతిభఁజూపి
హొయసలేశ్వరుఁడొక కొంత నుర్విఁగొనఁగ. 6

చలికి కులులు సామంతులై సంచరించి
రంత గుజరాతు మున్నగు ప్రాంతములను
వారి చరితలన్నియుఁ గూర్చ వశముగాదు
కాలగర్భానఁ గలిసిన కారణమున. 7

* * *

## వేములవాడ చలికివంశము.

## అరికేసరి II. 1008 - 1050.

వినయాదిత్య నృపాలుని
తనయుండరికేసరికిని ధర నరసింహుం
డు నృపతి, రాజాదిత్యుం
డను వాఁ డాతనికిఁ గల్గె యశముం బొందన్. 1

అరికేసరి నాముఁడు భూ
వరు విజయాదిత్య చలికి పనుపున వేంగీ
శ్వరుని పయి దాడి సలిపియు
దురమున నాతనిఁ జయించె దోర్బలమొప్పన్. 2

జనియించెను రాజాది
త్యున కంతట యుద్ధమల్లుఁ డూర్జితుఁడగు నా
జనపాలోత్తమునికిఁ గ
ల్గెను నరసింహ నరవరుఁడు గీర్తివహింపన్. 3

అతని కరికేసరీ నామ సుతుఁడుగల్గి
పాలనముఁజేసె వేములవాడలోన
భూరి విక్రమునే తత్త్రిభువనమల్ల
విక్రమాదిత్య సామంత విభుఁడనంగ
నలరి బిజ్జనరక్షించి, ఖ్యాతినొందె. 4

నరసింహుండు కదంబుల
నరి సైన్యము ఘూర్జరాళి నడచి యశంబున్
ధరఁగొనియె నండ్రు వానికి
సరియని కీర్తిని వహించె క్ష్మాపాలుండున్. 5

అతిథి యభ్యాగతుల సత్రములరఁ జేయ
నచట పానీయశాలయు నమరఁజేయ
దేవతాపూజ కొరకును దిట్టపరచి
నూటెనిమిది నివర్తనాల్, మేటిభూమి
యొసఁగె వేములవాడ నీ యుర్విభుఁడు. 6

* * *

## ము గిం పు.

వివిధమత సంస్కృతులుగల్గి, వేదవిద్య
విగ్రహారాధనము లభివృద్ధియయ్యె
సంస్కృతాంధ్ర కర్నాటభాషలుఁ జెలంగ
నిలను బశ్చిమ చాలుక్య లేలునపుడు. 1

అంగరంగ భోగములఁ జెలంగఁజేయ
దీపము లఖండముగ వెల్గఁ దేవళముల
ప్రజలు, నృపతులు, భృత్యులు, భక్తవరులు
ధనము భూముల నిత్తురీ ధాత్రియందు. 2

శైవమఠములు, విద్యార్థిసంస్థ లెన్నొ
యెల్లచోట్ల, తటాకముల్ వెల్లివిరిసె
కలవెఱుంగక ప్రజలు సుఖంబునొంద
రణములనివార్యమైనను రాజులకును.

* * *

# ఆ దే య ము.

అరువది రెండవ సంవ
త్సరప్రాయపు రచనమిద్ది తజ్ఞులుదీనన్
నెరసులు గల్గిన దిద్దియు
సరిజేసి పఠింప మిగుల సంతసపడెదన్.

కొత్త భావయ్య చౌదరి,
10-1-1959.

* *

# స్థల సాంకేతములు.

అంగ = బెంగాలు దేశము.

అలూప

కర్నాటము = కన్నడదేశము.

కమ్మరాష్ట్రము = కృష్ణకు దక్షిణోత్తరములందలిది.

కమ్మనాడు = గుంటూరు జిల్లాలోనిది.

ళింగ = ఉత్తరాంధ్రదేశము.

నర ంతల :

కతంబలిగొ = బీజపూరు జిల్లాలోనిది.

ధ కొషళి = ఒరంగల్లు ప్రాంతము,

సల = అయోధ్యదేశము.

సరి ళ = నేటికేరళమే. (మలబారు)

అతిథ కణము = పశ్చిమ సముద్రము

నచ ప్రక్కజిల్లా.

గోదావరిజిల్లాలోనిది.

బీజాపూరుజిల్లాలోనిది.

న

యె గవాడ . లు = మైసూరు లోనివి.

గూర్జర = గుజరా

చిల్లకుండి = బీజపూరుల

చోళ = దక్షిణదేశ ఒరం ప్రాంతము

టెంకణము = అనంతపూరు ప్రాంతము.

ర్దవాడి 1000 = బీజపూరులోనిది.

దేవరాష్ట్రము = శ్రీకాకుళము జిల్లా యలమంచిలి ప్రాంతం.

దేవగిరి =

నలవాడి లేక నరవాడి = కర్నూలులోనిది.

నోలంబవాడు = 32 వేలు = మైసూరులోనిది.

పలనాడు = గురజాల, మాచెర్ల ప్రాంతం.

పాండ్య = దక్షిణ మధురప్రాంతం.

పురిగరి-300 = బీజపూరులోనిది.

పాకనాడు = కడపజిల్లాలోనిది.

బాణరాష్ట్రము = నెల్లూరులోనిది. పెన్నానది చుట్టు గలది.

మగధ =

మద్రక =

మరాట = మహారాష్ట్రము.

మాళ్వ = ఉజ్జయినీ ప్రాంతము.

మూషిక =

మౌర్య = మౌర్యులుపాలించినది.

యెలమేలునాడు = బీజపూరులోనిది.

రట్టపాడి 7½ లక్ష = రాష్ట్రకూటరాజ్యము తర్వాత చాలుక్యులది.

రేనాడు = కడప జిల్లాలోనిది.

లాట = గుజరాతి.

వేంగి = మధ్యాంధ్రదేశము.

వైజయంతి = మైసూరులోనిది.

వట్టూర :

వాకాటక = వాకాటకులుపాలించినది.

వనవాసి = మైసూరులోనిది.

సబ్బిసాయిరము = కరీం నగర ప్రాంతం.

సిందవాడి = బీజపూరులోనిది.

హిరణ్యరాష్ట్రము = నెల్లూరుజిల్లాలోనిది. ఆత్మకూరుతాలూకాప్రాంతం.

హొయిసలరాజ్యము = మైసూరులోనిది